# పీఠిక.

"కృష్ణాభక్తకల్పద్రుమా" యనుశతకము శార్దూలవృత్తములతో భక్తిపూర్వకముగా భక్తజన మనోరంజకముగా భగవదనుగ్రహంబున గుంటూరుజిల్లా వినుకొండతాలూకా రామడుపాలెము వాస్తవ్యుఁడు బలిజ వంశసంజనితుండు వోబుళాపురపు చినకోటయ్యగారి జ్యేష్ఠపుత్త్రుఁడు లింగమూర్తియను నాచే విరచింపఁబడినది.

ఇందు 55 మొదలు 102 వఱకుఁ గల పద్యప్రథమపాదాద్యక్షరములు "వరకుమీకసుకాయ"లను పద్యమగునట్టియు 46 మొదలు 54 వఱకు పద్యప్రథమపాదద్వితీయాక్షరములు కవిపేరు, 61 మొదలు 65 వఱకు ప్రథమపాద ద్వితీయాక్షరములు గల్లా గాలెయయనుపేరు వచ్చునట్టి నియమము గావింపఁబడినది.

ఇయ్యదియే ప్రథమప్రయత్నమగుటం బట్టి శ్రుతపాండిత్యమవుటం జేసి యిందులో నందందు దోషములుండవచ్చును. ప్రమాదోధీమతామపి యన్న యార్యోక్తిచే నియ్యది పెద్దలు మన్నింపఁ బ్రార్థితులు.

ఈపొత్తమును రచింపఁ బ్రోత్సహించి విని సంతసించి పిదపఁ దన్ముద్రణంబునకు ద్రవ్యసాహాయ్య మొనరించి

యాదరించిన మిత్రవర్యుల నీక్రింది పద్యపూర్వకముగ సంస్మ
రించి కృతజ్ఞత దెల్పుచున్నాడను.

చ. వినుతయశుండు బల్జికుల। వీరుఁడు దాతఁడు ధార్మికుండు వా
గ్వినయవిశారదుండు హరి। కీర్తనపర్యవసాయుఁడుం గడుఁ
జనవున నన్ను భక్తవరు। సత్కవితన్శతకంబు వ్రాయుమం
చని ధనమిచ్చులింగయకు। శౌరియొసంగునుగా కభీష్టముల్

గీ. లక్కవరపురవాసిస। లక్షణుండు
నుల్లసిల్లుగానముల పాల। వెల్లియగుచు
కర్ణవంశాంబు నిధి నిశా। కరుఁడనంగ
లింగయ చెలంగె బుధ జన। పుంగవుండు.

సీ. శ్రీమించు సౌందర్య। చిత్తజాకారుండు
కోమలుండలపంట। కోటిరెడ్డి
నయగుణుం డతులితా। నందుండు సుజనుండు
మేటిధీరుఁడు పంట। కోటిరెడ్డి
సాధుజనావన। సంభ్రమశీలుండు
కులధురీణుఁడు పంట। కోటిరెడ్డి
నిశ్చలభక్తుండు। నిర్నిద్రధైర్యుండు
కోపశూన్యుఁడు పంట। కోటిరెడ్డి

యంబుజాస్యుండు మల్లపా। లెంబునందుఁ
బరగ రెడ్డి కులాంభోధి। పదములోన

నమృతభాండంబితండన । నవతరించె
నట్టిమాన్యుని శ్రీకృష్ణుఁ । డరసిబ్రోచు.

చ. గొనములప్రోవుముఖ్యులను । గూర్చెడుతావువివేకశాలిశాం
తనవునిమించుయోగ్యతను । ధారతసూరకుమారుఁబోలుసం
వినయుఁడుసద్యశోఘనుఁడు । వీరుఁడుసజ్జనగణ్యుఁడైనయా
యెనుములనర్సయాఖ్యునకు । నెల్లపుడీశుఁడొసంగుసౌఖ్యముల్

ఉ. కోమలమానసుండునయ । కోవిదగణ్యుఁడు ధైర్యశాలియున్
నీమముగల్గువాఁడమిత । నిర్మలవాక్చతురుండు భక్తినెం
తేమదినిల్పువాఁ డతని । కెన్నికతో సతతమ్ము జానకీ
రాముఁడువోబుళాపురపు । రామయకిచ్చునుగాక సంపదల్.

మ. ధరణిందానముచింతలన్వలయుత । గ్రామంబునన్ వోబుళా
పురశేషయ్యసుపుత్త్రకోటయనుసం । పూజ్యుండుకృష్ణుండుదా
నిరతమ్మున్నిరులిచ్చి ప్రోచుతయశో । నిస్తంద్రు సుజ్ఞానసుం
దరు సన్మాన్యుని సద్గుణాశ్రయునిజిం । తల్బాపియెల్లప్పుడున్.

శా. సల్లాపప్రియుఁడు న్మనోజ్ఞుఁడుసుహా । సన్మానయుక్తుండున
త్యుల్లాసుండుమహాత్మదీయకులయో । గ్యుండాహవప్రక్రియా
మల్లుండై తగుషేకుఖాసిమును బ్రే । మంబూని చిత్తంబులో
నల్లాయెప్పుడుబ్రోచుఁగాకవితతా । ప్తైశ్వర్యసంయుక్తుఁగన్.

ఇట్లు,
గ్రంథకర్త.



శ్రీ

# కృష్ణాభక్తకల్పద్రుమశతకము.



—: శార్దూలవృత్తములు :—

శ్రీహృత్సారసభృంగ రంగ వినుత । స్త్రీశాగిము క్తికృతో
ద్గ్రాహాసద్విమలాంతరంగ సదయా । తార్క్ష్యధ్వజాలోలనా
నాహారాస దృశప్రభావగుణ సం । ధానాతిపుణ్యోదయో
త్సాహా మాన్యశరీర రాముపలి కృ । ష్ణాభక్తకల్పద్రుమా. 1

గానానందన సాంద్రరుంద్ర వినయా । కాదంబయానాస భా
షానాభక్తవిలోల పద్మనయనా । ప్రావీణ్య సత్త్వోదయా
మానానూన యవార్య వీర్యవృషభా । మాణిక్యమూర్తిప్రియా
జ్ఞానోద్దీపనరూప భూరుచిర కృ । ష్ణా. 2

సారాచార విశారదా వరద సం । సారోత్తమో భాస్కరా
శూరాగ్రేసర చిత్కళోత్కలిత సం । శుద్ధాతి చాతుర్య వ
ర్ధీరా కల్పవికల్పవాగ్గరిమస । ద్భోగాభినాగాత్మదో
ష్ణారా భూరియశోవిశాల యమకృ । ష్ణా. 3

రామా సత్కృతిధామ భూవిజయ ది। గ్వేదండకాండోపమా
స్థేమాంచద్భుజ కీర్తిహైమనగవా। క్షేమా జగత్ప్రక్రియా
సీమా శీలగుణాలవాల కరుణా। శ్రీసాంద్రనిర్యాతనో
ద్దామా దీనజనాళి బ్రోవు కృ। ష్ణా. 4

చండా కౌశిక సత్క్రియాంగశుభగ। శ్రీరామ శస్త్రాస్త్రలస
త్కాండాఖండనదోఃప్రతాప సుగుణో। త్తండప్రధానోత్తమా
ఖండా గండవిశాల తాలభుజసు। గ్రాహావహ ప్రక్రియా
శౌండా భక్తజనాళిఁ బ్రోవుము కృ। ష్ణా. 5

పారావార గభీర దానవహరా। వైకుంఠ నారాయణా
దారాపుత్ర మహాభవాబ్ధి తరణా। ధర్మైకచిత్తాసతీ
మారాసుందర భానుతేజసుజనా। మన్మందిరావాస శ్రీ
నారీ హృత్కమలావిలాస వర కృ। ష్ణా. 6

గోపీవల్లభకృష్ణ కష్టములు లే। కుర్వీ వెతల్ పాపుమో
యాపద్రక్షక లెమ్ము లెమ్ము కడు దీ। నార్తున్ననుంగావనా
పాపంబుల్ పరిమార్చి దుఃఖలతలన్। బ్రెద్దోలి నీచెంతకున్
వైపొప్పన్ వడిఁ జేర్చుమా దయను కృ। ష్ణా. 7

నీపాలంబడితిన్ మహేలవె జగ। న్నేతా త్రిలోకార్చితా
గోపాలా కడుదుర్భరం బగువ్యథన్। ఘోషించుచున్నాఁడ నే
నీపాదమ్ములయాన నన్నుఁ గనవే। నిక్కంబు రక్షింపవే
నాపాపమ్ములు పారఁదోలి యదుకృ। ష్ణా. 8

కుంతీపుత్రులు నీమహామహిమచేఁ । గోల్పోవు సంపత్తశే
షాంతమ్మున్నపుడీఁ బొందుసద్విజయము । న్నంధించునీప్రౌఢతల్
వింతల్ నిత్యము నెన్నికగ్గొనుచునే । వేమాఱులున్నారు సు
స్వాంతా దుఃఖవినాశదేవయదు కృ । ష్ణా. 9

వంతా నీదువిలాస వాగ్గరిమ నె । వ్వం డేని వర్ణింప వి
భ్రాంతాకల్పిత చిద్విలాస వరదా । ప్రావీణ్య శూన్యాదిమ
ధ్యాంతాగణ్య త్రిలోకమాన్య సచివా । యానందసంధాయకా
శాంతానిర్గుణ నిర్వికారయదు కృ । ష్ణా. 10

చాలాబీదయి యక్కుచేలుఁడధిక । శ్రాంతాభిలాషుండునై
లీలామానుషవిగ్రహాత్మ వనమా । లిన్నిన్ను విద్యాయుతా
వాలాయంబునఁ జేరఁజీరిసిరులం । బ్రాపింపఁగా నా దయా
శాలీ యింత పరాక రాముపలి కృ । ష్ణా. 11

వంటల్ చేసియె గార్లుబూరెలును బి । ల్వన్నిన్ను వెన్నంటఁగా
నుంటంగాంచియుఁ గౌరవుల్ రిపులటం । చూహించిరాగన్విదుర్
వంటన్మచ్చికఁ జేరి భోజనమొన । ర్పంబోయి యాయత్తమై
జంటన్మెక్కవె పంక్తినొక్కమొగి కృ । ష్ణా. 12

మన్నేలా తినెదంచుఁ దల్లినిను ము । మ్మాన్మెట్లి భాషింపఁగా
నన్నేలా యిటులాడ మన్నుఁదిన నే । నాకొంటినో వెఱ్ఱినో
యిన్నేలా యిటుచూడు నోరు జననీ । యీవంచుఁ జూపంగనం
దన్నావిశ్వ మదెల్లఁ గన్పడదె కృ । ష్ణా. 13

కోకల్వప్రియు గోపికాజనము ని । న్గోవిందు సేవింతుమ
న్వేఁకన్ స్నానముచేయుచున్న తఱిఁ ద। ద్వేషాతిరేకంబుతో
నేకా చీరలుపొంచి ముచ్చిలితివా । హృద్వృత్తిచాలించిన
న్నాకన్ రావ మహానుభావయదు కృ । ష్ణా. 14

ఏలీలన్ననుఁ బ్రోతువో యదుకులా।హీనాబ్ధిచంద్రోదయా
పాలింపం జోరవేమి నీకధికమా । భారంబుగా నుంటినో
యాలింపన్మ నసుండదో చెవులక । య్యాదెబ్బవిన్పింపదో
జాలిన్ లేశముఁ జెందవోమదిని కృ । ష్ణా. 15

ఎన్నోభంగుల నీచరిత్రముల నెం । తేనాత్మఁగీర్తింపసం
పన్నావైభవకాంతి మాయఁగలదే । స్వైస్వైవికాసింపకే
వన్నెల్ పోవునె మేల్మిబంగరును వే।మార్లగ్నిలోనుంచుచు,
న్నన్నంగొట్టినఁగాని రాముపలి కృ । ష్ణా. 16

నాశావర్జిత దీనబాంధవహరీ । నాళీకనేత్రాచలా
కాశాపూర్ణకటాక్ష వీక్షణచయా । కంసారిభక్తావనా
వేశానిర్మల చిత్తకౌస్తుభమణీ । విఖ్యాతవక్షస్స్థలా
యాశాపాలక పాలరాముపలికృ । ష్ణా. 17

కూడంగూడఁగ సద్గుణోద్గణముచే । కూర్పించుఁ గైలాసమున్
బాడంబాడఁగఁ దద్చ్చరిత్రములిలన్।బ్రాపించువైకుంఠమున్
వేడన్వేడఁగ నెందుసిద్ధమయి యీ । విశ్వంబునన్. స్వర్గమే
జాడన్నాకడ రావు రాముపలి కృ । ష్ణా. 18

చల్లో పాలిదె పెర్గు వెన్న యరుచుర్ । జాటించి వేవేఘులన్
గల్లోలంబుగ సంచరించువ్రజ సం । ఘుంబందు జన్మించి యీ
మూల్లోకంబుల గొజ్జవయ్యు హృదయ । మ్ముల్లొన్ననీకొనెయ
ల్లల్లన్నమ్ము ననాదరించుటలు కృ। ష్ణా. 19

గోటన్నీటవె శైలమున్ త్రిదశయు। క్తుండై మహోద్యద్భుజా
ధాటిన్ శక్రుడు ఆళ్లవర్షముకడున్ । ధాంకారభాంకారముల్
మాటన్ మ్రోయుచునింపగోపకులనె। మ్మిన్ గోవులంబ్రాణముల్.
నాటంగావవె దీక్షఁ బట్టి యను కృ । ష్ణా. 20

లేవా యిద్ధరఁ బ్రోవమమ్ము దయతో । లేవయ్యయాలింపస
ద్భావాతీత యనంతవేద్య యతులఁ । ప్రౌఢత్వశాలీమనో
దేవా యీచలమేలఁ బూనఁ దగునా । దీనుంబ్రిసాదింపకు
న్నావా భక్తసురక్షరాముపలి కృ । ష్ణా. 21

భాషా మంజులతా విశారద భుజా । బాహుళ్యతాశౌర్య సం
తోషా పూర్ణ మనోంబుజాత సుగుణ । స్తోమోన్నతాప్రస్ఫుర
ద్వేషా సన్నుత యుత్తమోత్తమ నమ । ద్దిక్పాలవేతేయిఁకన్
భాషింపం దగునయ్య ప్రోవుమని కృ । ష్ణా. 22

ఎంతో మంచికులంబు గొల్లకయినన్ । హేరాళమై వేపగిం
జంత్రైనన్ జిఱువెట్టికద్దనెడి యా । సామ్యంబువిన్నన్ ధరన్
వింతల్గావు దలంప నీమెడల నే । వృద్ధమ్యోనామాట వి
న్నంతన్ వేఱువచింపనేల యదు కృ । ష్ణా. 23

నన్నుఁ దూఱితినంచు రౌద్రమును బొం। దంబోకుగోపాలనీ
కన్నన్ దైవము లేరుమాకుఁ ద్రిజగ। త్కల్యాణభద్రార్చితా
నన్నుఁ జూడఁగ నవ్వులాయని మది। న్నాళీక పత్రాక్షయా
సన్నుఁ జూచియె కావు రాముపలి కృ। ష్ణా 24

నీకారుణ్యము వర్ణనీయము గదా। నిత్యేశ నీపల్కులో
లోకాతీత వినంగ హర్ష మొదవుం। లోకార్చితా గోపకా
ల్లాకారానటన స్వరూపవరదా। రావేలరక్షింప న
న్గైకోరా తగవేల రాముపలి కృ। ష్ణా. 25

ధీరస్వాంత విశాలనేత్ర వరదా। ధీమన్మణీ రాజితా
కారా మంజులగాన సత్ప్రముఖ యె। క్కాలంబుఁ గీర్తింతునిఁ
వీరాగ్రేసర పార్థ సద్విహిత సం। విచ్ఛన్న సంపత్కళా
పారా రాపులి కేల రాముపలి కృ। ష్ణా. 26

నానాగాన వితాన మానస సదా। నందాఢ్య విద్వాంస సం
మానా నిన్నెదనమ్మినాఁడను గృపన్। భావించిపోషింప విం
తేనా యెందుల కేఁగితో కనుల న। న్వీక్షింపకున్నావు సు
మ్మా నాప్రాణము నిల్వదింక యదు కృ। ష్ణా. 27

ఇంతుల్గోపిక లెల్లఁ గొల్వఁదమితో। నింపొందు చేమంతి పూ
బంతుల్చేకొని యాడుచుండి యిదె చూ। పంఙ్గోవు నీమోము సు
స్వాంతుల్ మీరలుగానఁ జెల్లెఁదలఁపుల్। సాధింపమా భోటిదీ
నాంతుల్ తాళుదురే కనంబడమిఁ గృ। ష్ణా. 28

చంపంబూనియె పాండునందనుల ని । శ్శంకప్రసక్తిన్ విషం
బుంపన్ భోజనమందుఁ గౌరవులు తా । మోహాోదయన్మానిక
ల్పింపన్ వారలపాలిదైవమయి యే । వేళందుఁ గాపాడునీ
సంపన్నత్వము నెంతునెమ్మదినిఁ గృ । ష్ణా. 29

పూఁదేనెన్ గడుఁద్రాక్షఁ జక్కెఱనునీ । మూఁడౌ క్షటంగల్పియున్
రాదే యారుచిమెక్కినన్ నిజకథా । రాజత్సుధాపానమే
కాదే రుచ్యము దీనిమీఁదనది యె । క్కెంజాలుఁనే సత్యమ
య్యా దేవా సుగుణప్రభావ యదుకృ । ష్ణా. 30

గంధర్వప్రభునేలవే కరిని వే । కాంక్షించి రక్షింపవే
యంధపత్రిక్రియ నన్నుఁ గన్గొనవు స । ద్భక్తప్రజాపాలనా
సంధామంగళరూప దివ్యతర స । త్సంకల్ప నిర్నేత సు
స్కంధా ప్రోవఁగరమ్మిరమ్మి యదుకృ । ష్ణా. 31

త్రైలోక్యమ్మును మోహముంగొలుపును । ద్యద్దివ్యరూపంబునే
యాలోకింపుచు దేవదానవులు క । య్యాలాడు నచ్చోట దృ
శ్యాలోలుండవునయి వడింజనియుఁద । న్దైత్యాలిఁగామక్రియా
స్థాలింజేసిసుధన్ సురాళికిడు కృ । ష్ణా. 32

ఈయాకాశముభూమి దిక్పతులు నీ । యిందాదిబృందారక [న్
చ్ఛాయాసూనుదినేశవహ్ని పవనుల్ । సాధ్యుల్ నికాయంబులు
గాయాోనీకము లింద్రియంబులజుఁడున్ । కైలాసశైలాలయుం
డాయాసర్వమునీవెగావె యదుకృ । ష్ణా. 33

ప్రావృత్తోదయమందు లేచి మదిని । న్భావించి నీపూజలన్
గావింపన్ సుగుణాలవాలదయ రా।కన్నీవు కల్మారు మ
ద్భావంబేల పరీక్షచేయుదువెదః । దాక్షిణ్యమున్మానియు
న్నావానందకుమార రాముపలి కృ।ష్ణా భక్తకల్పద్రుమా 34

దీక్షనిన్ను స్మరించువారలకు నెం।దెంతైనఁగష్టంబు సం
ప్రోక్షింపంజనవన్న యార్యవచనం।బుల్ వించుసంరక్షణా
పేక్షన్ మ్రొక్కుచుఁగొల్చుచుంటిసుగుణో।పేతాదయామూర్తిస
త్సాక్షాత్కార యశోవిశాలయదు కృ।ష్ణా. 35

రాజీవాక్ష విరాజమానసుగుణా । రమ్యప్రతాపా కత
ద్వాజీ దీనశరణ్యదానవ హరా । దారిద్ర్యదుఃఖాపహా
రాజీవధ్వజ రూపభూరమణ । యోరాతిప్రచరధ్వంసకో
ద్ధాజీబోధనవె వేగరాము పలికృ । ష్ణా 36

రాకాపూర్ణశశాంకబింబవదనా । రమ్యాంకనాదేలనూ
రాకారానవనితచోరగిరి ధీ।రా మాతులధ్వంసనో
ద్రేకాచిత్తజుఁ గన్నతండ్రియలుకం । దండింపన్యాయంబెయం
దాకాయింతపరాకరాముపలి కృ।ష్ణా 37

కానన్ గోపులమేపుదున్ మఱచితో । కాంక్షిసినిద్రించితో
పూనన్ రావిదియేమి పాపమొకొ నీ।బుద్ధిల్ల పోఁజాగె మీ
చానన్ రుక్మిణిఁజూచి మోహమున సం।సారాంధతంగూలి స
న్మానింపన్ దడవేలచేసెదవు కృ।ష్ణా. 38

నీకాంతామణులెవ్వరైన నిటుల । న్వాళ్ళఁగవద్దంచు నెం
తో కార్పణ్యముచేత నడ్డగిలఁగాఁ । దోడ్పాటుఁగావించిరో
లేకాదీనులఁగావ భారమొకొ యా । లింగూడు సయ్యాటలో
హా! కన్నోయికి నేడుఁ గన్పడవో కృ । ష్ణా. 39

పిల్లంగ్రోవినిఁ గేలఁబూని కడులోఁ । బ్రేమించి గానమ్ము గుం
పిల్లంజేయుచు నాట్యముంజలిపి యు । త్ప్రేక్షింపకే దీనులం
దల్లన్నిర్దయఁ బ్రాలుమాలి వెతచే । నల్లాడుమంచున్ వృథా
సల్లాపమ్ముల నాడమేలెయను కృ । ష్ణా. 40

లేరే నీసరివేల్పులింక ధరణిన్ । లేరంచుఁ బల్కంగ న
య్యారే నీకిది పాడియా నెఘునహా । నాయింతకోపంబు వ
హ్వారే చిత్రముసుమ్ము గన్గొనఁగ నీ । వయ్యారిచారుక్రియా
చారమ్ముల్ వినినంత రాముపలికృ । ష్ణా. 41

కారారాజులు నీవలెన్ బృథివిలోఁ । గామ్యాదిభోగక్రియల్
లేరాయింతులువారికిన్ మఱచిరే । లీలావిలాసంబులన్
పారావారమునన్ బరుండఁదగునే । భక్తాళిఁ గాపాడకే
సారాచారవిహారరాముపలి కృ । ష్ణా భక్తకల్పద్రుమా 42

ఉట్లంబెట్టిన వెన్నలుం బెరుగుపా । లున్నంతయుం ద్రావియా
చట్లంబ్రద్దలుకొట్టి కన్గొనఁగనే । చల్లంగఁ బైఁజారిచీఁ
కట్లందాగుడు మూఁతలాడునటులన్ । గాఁబోలుదాగుంటమీ
యట్లంగాని యెఱుంగమెందు యమకృ । ష్ణా. 43

వేషమ్ముల్ పదిదాల్చిదుష్టులను సం। వేద్యాడవై కూల్చి సం
తోషమ్ముంగలిగించి భక్తులకు సం।తో చెంతకుంబిల్చి త
ద్దోషమ్ముల్పరిమార్చి సంతతము నిన్।దోషింపఁగా జేయుటల్
భాషింపందరమయ్యె రాముపలి కృ।ష్ణా. 44

మోమోటంబిసుమంత లేక యె దయన్। బోనాడియింటింటను
త్కామాలోలత గోపికాయువతులన్।దర్శించుచుంగూడి రా
వేమో తెల్పుముమోడి యేలమనుపన్। వేమారునిన్వాడినీ
నామాంతస్సుధఁ గ్రోలుచున్న యదుకృ।ష్ణా. 45

లేవో పృథ్విని నీవుదైవమయినిన్।లెక్కింపరిత్తైనోయి
న్నావో తెల్పుము ధైర్యమున్ జెడి,గనన్।రానైతి మొఱ్ఱల్లివన్
రావో కర్ణములో దయాభరణయో । రా వేలగోపాల వి
న్నావో యింతులపల్కులీవు యదుకృ।ష్ణా. 46

నీబుద్ధేమిది కొంటిచేష్టలఁగదున్ । నిండారనూరేగఁగాఁ
దోఁబుట్టుల్ మఱిలేరనాపగిదినిన్ । దుఃఖింపనోదార్పవా
పూబూసిందనఁ జెట్టుకన్నడునె నీ।పూన్కెల్లరిత్తాయె న
న్నాబాటన్ దయఁజూడకున్న యదు కృ।ష్ణా. 47

వేళాకోళపు వెక్కిరింతలనుచున్ । వీక్షింతె నీపైని యీ
వేళన్నిందనుమోపి ప్రాణముల నే।వీడంగనున్నాను గో
పాలా భారము నీదెసుమ్మినను నీ।పాదద్వయిం జేర్చి శ్రీ
శాలీబ్రోవుము నేడు రాముపలి కృ।ష్ణా. 48

శేపున్నాపును నీపదాబ్జముల వే।ద్వేటిట్లుచిత్తంబునన్
దాపుంజేరిచి భక్తియుక్తిమెయి ని।ద్రాసక్తియున్మాని స
ల్లాపోక్తిన్ భజయించుచుంటి ననఘా। లావణ్యరూపా యిఁకే
యాపున్నమ్మకయుందెజొచ్చితిని కృ।ష్ణా. 49

ప్రారంభోద్యమదివ్యతేజకరుణా। బాంధవ్యమాపాలని
త్యారాధ్యాశ్రితగణ్యపుణ్యచరితా। యానందరూపాన్వితా
సారంగాశతపత్రమిత్రశశి వీ।క్షాశ్రీసతీపద్మ హృ
త్సారంగా సుజనాంతరంగ యదుకృ।ష్ణా. 50

పాలింపన్ బిరుదంబుఁ దాల్చియిటులన్।బాఱంగనున్నావు కు
య్యాలింప న్నలుసంతలేదె దయయ।య్యానాదుపాపంబులం
దూలింపన్వడిఁ జేరరావు జగము।న్బోషింపవో జాలముల్
జాలింపందగునయ్య రాముపలికృ।ష్ణా 51

మాంగల్యోదయసద్దయాయదువరా। మాన్యాదయాశీలయు
త్తుంగప్రాభవగానమోదనఘృణా। తోయాకరా శ్రీమనో
భృంగస్థాన మహావిలాసకమలా। భీమాసురధ్వంస స
త్సంగప్రాపక ప్రోవరావ యదుకృ।ష్ణా. 52

నీమూర్తిఁ గనులారఁజూడ నెలమిఁ। న్నిన్నుంగనన్ బూర్వమే
నోముల్ నోచిరో నీదుమాతజనకుం।డుఁ బేర్మి సత్పూజలే
మేమో చేసిరి గానవారలకు నీ।వే పుత్రుఁడై పుట్టినా
వామోదంబుదలిర్ప రాముపలికృ।ష్ణా. 53

కీర్తిప్రక్రియఁ జెందనీపయిని భ।క్తిన్నూఱుపద్యంబులం
బూర్తింజేయఁదలంచి నీపదములం । బూజించి నిశ్చింత వి
స్ఫూర్తింజేసితి నీటముంచెదవొ యి।చ్చోఁ దేల్చెదో గాని నా
యార్తిం దీఱుప నీదె భారమిఁకఁ గృ।ష్ణా. 54

యావద్విశ్వము బొజ్జలోనిమిడినన్ । హావేఱు చింతింప నె
ద్దేవుండైనను గాంచి బ్రోవఁగలఁడా । దేవాది బృందంబులన్
గావం దైవము నీవెకావె కరుణా । కైవల్య సంధాయివై
నావీవేయిఁక జంకులేల యదుకృ।ష్ణా. 55

రవ్వాల్ వేయును జేయనేల? మనుప।న్నావేల? దీనుండవా
క్రువ్వన్ బ్రోవవె యక్కరేణువిభునిం । గోవిందయంచార
కవ్వం జేమిసువారమిచ్చె నిటు మొ।క్కన్నన్నుఁ గన్నంత చి
ర్నవ్వంబుట్టెనె యబ్బురంబోదవి కృ।ష్ణా. 56

కుయ్యో మొఱ్ఱో యటంచ హర్నిశము నీ।కోసం బె ధ్యానించి కృ
ష్ణయ్యా యంచు మదిందలంచి పదివే।ల్సారుల్ తమింబోక క
న్నయ్యా వేఁడుచునుంటి నిర్దయనను।న్నావేమి యేమందు రా
వయ్యా నీకిదితీరె రాముపలి కృ।ష్ణా. 57

మీకుంగల్గినా లోకు లెవ్వరయిన । న్బోధించిరో యీవిధం
బాకో యన్నమటంచు నేడ్చుగతిన।న్నయ్యయ్యొ యేడ్పించుచుం
జోకంబల్కిరొ గాకయున్న యిదియెం । దుంబుద్ధిలక్ష్యంబె య
న్నాకర్ణంబుల ఘోష యేమనుదు కృ।ష్ణా. 58

క న్నాఁడన్నటి నీదుకొంటెతనముల్ గాసంతయున్నేఁడు గూ
ర్చున్నాఁడన్నరి మూఁడుచేర్లు తెగినట్టిట్టి న్మతేమన్న ని ప్రో
ల్చున్నాఁడంగడుఁగ'య్యవో లెమదినిన్నూహించుచున్ బాసి
నున్నాఁడందనువాఁడు ప్రాణములఁ గృష్ణా. 59

సుద్దుల్వేయును నేలవేచిక దుశ్రద్ధన్ నామసంకీర్తనా
బుద్ధిన్మాన నిఁకెన్నికష్టములు సంప్రాపించినంగాని నీ
వద్దన్నేరుతలంపి వేఱొకటి యన్వేషింపఁగాలేదు నీ
హద్దున్ దాటనుసుమ్మి రాముపలి కృష్ణా. 60

కాఁగన్నావిధియిట్టులుండె నెటులుంగాన్పింపకుండన్ వృధా
ప్రమోఁగన్నేయుచుఁ గూరుచుంటి నిచటన్మాతెవ్వరున్లేరిటు
ప్రాఁగన్నేరవనన్నుఁ బ్రోచుటకు నుల్లాసంబు లేత్రోవను
నాఁగన్నేరవె చెప్పు రాముపలి కృష్ణా. 61

అల్లన్నీదగు చిద్విలాసమను నెయ్యంబైన సత్కీర్తి శో
భిల్లంగాఁ బరమోపకారివయి నెమ్మింజిల్కు నీభక్తితో
గొల్లన్నా దశవేషధారి భవమున్గాల్పంగరావె పయిన్
జల్లన్నీకరుణారసంబు యదుకృష్ణా. 62

లంగామాడకు పోలెడమ్మఁబదిపోలల్ గొన్నధాన్యంబునో
ప్పంగంగోమటికిం దలంపనటు లేపల్మాలు సన్మిత్ర నీ
శృంగారంబగు నామముందలఁప నిర్నిద్రప్రభావుండనై
నంగానంబడదే పరంపరగఁ గృష్ణా. 63

దూఱ్రం బాఁడిగవచ్చిదానవుఁడు నీ।తో మైత్రిగావించి ని
న్నోర్చలెందా విజయుండు శక్తియుతుఁడై। మఱిన్ శాంతశీలుండునై
యేలెన్ రాజ్యము నయ్యుధిష్ఠిరుఁడు వా।ర్ధింద్రోయభీముండునై
జాలెన్ నీమహిమం బపారమది కృ।ష్ణా. 64

రాయుంచుం జనవ్యర్థమై మనసు పా।లిం జంచలం బై కడున్
గాయం బెల్లవడంకఁజొచ్చె నసువు।ల్గాసిల్లి పోసాగెఁ బె
న్మాయం బెల్లగిలంగఁజేసి కరుణం। బాలింపు లేకున్న నే
చాయం ద్రోయఁదలంపొ చెప్పుమికఁ గృ।ష్ణా. 65

క్షుద్యోగ్యమొఱ్ఱో యటంచు వేల్పుగుము లో।గోపాల వేవేగరా
వయ్యోమందరశైలమీజలధినో।య్యంగ్రుంకనుండెందయన్
వెయ్యారాసరులుఁ బ్రమొక్కనామనఁగ నే।వె న్వెంటగూర్మంబవై
సయ్యాటన్గని యెత్తవే గిరిని గృ।ష్ణా. 66

ప్లినంబై సచరాచరంబు మెఱుమై। మించం బ్రవర్తించి స
న్మానం బొప్పఁగ నేలవే బుధమహా। మందార సత్ప్రీత
జ్ఞానంబై యకలంకమూర్తివయి సా।కారుండవై జ్ఞానివై
యానందాత్ముఁడవై ఘనుండవయి కృ।ష్ణా. 67

బంధుప్రీతినిజన్నవాఁడవా యిఁకన్। బల్మాలు భక్ష్యబులం
గంధమ్ముల్వడి మెక్కఁదావిఁ గోనన్। లేకున్న వేమాఱు ని
ర్బంధపేర్మవహించి మోహపడి యో।రాధాసతిం గూడ గా
మాంధత్వంబను మాయలోఁ బడితొ కృ।ష్ణా. 68

దుర్భాగ్యంబులు సంపదల్గలిగి సం। తుష్టుండనై యుండి యీ
నిర్భాగ్యంబగు బంధుపుత్రవితతి। స్నేనాబలంబంచెదన్
గర్భావేశతఁ గాలముంగడపుచున్ । వృద్ధుండనై యిట్టి సం
దర్భంబుంగని యాడ్చితిం దనువుకృ।ష్ణా. 69

ఉవ్యాజంబునుగున్నగంధమును బూ।జంజేయ నేఁదెచ్చి నా
నివ్వేళం గనుమీ కృపామతివనై । యీపుష్పగంధమ్ములం
దివ్వంబూనితి మీకు భక్తిమెయిబూ।న్కింబుచ్చుకొమ్మింకని
కన్వ్యండేమిఁక హెచ్చునాకు యదుకృ।ష్ణా. 70

ఉవ్విళ్ళూరుచునుండె జిహ్వనిజనా। మోచ్చారణ న్వేలుపుం
బువ్వంజుట్టుకొనంగ రేఁబవలు తెం।పుల్లేని మోదంబుతో
నెవ్వేళం దమదర్శనంబొదవునో । యేజాడవర్తింతునో
నవ్వల్గావు పరంబెఱుంగనిఁక కృ।ష్ణా. 71

లక్షల్కోట్లుగ నార్తులైనజనులన్ । రక్షింపఁగాలేదె యే
కక్షన్నన్నడి నేఁచఁబూనితివొ యా।గాకష్టసాంసారికా
పేక్షావారిధి నీదఁజాలఁ గరుణా। ప్తిన్ భావనానావనో
సాక్షాత్కారుఁడ పంపవేడెదను గృ।ష్ణా. 72

త్రోడింకెవ్వరు లేరు నాకుఁ దమమూ। ర్తుల్దక్కఁ జేదోడువా
దోడున్లేరుమఱెవ్వరున్ద్విజగముల్ । త్రుంపంగఁబెంపంగఁబొ
ల్లాడింపంధరఁగర్త వేఱొకరులే। రన్నన్న నీకన్నను
న్నాఁడేమో మఱిఁదెల్పు రాముపలికృ।ష్ణా. 73

సడ్డల్గావివిలోపలై వెలుపలై । సంసారియై యోగియై
యొక్షుంజేరు విరాగియై కలికియై । యోజింపబైరాగియై
బౌడ్డుం దామరబిడ్డయై కమఠమై । బుద్ధుండయై కర్తయై
యడ్డ న్వేఱొకటున్నదే వెలయఁగృష్ణా 74

ముంజేతఁబెద కంకణంబు నిడితే । మున్ లోకసంరక్షణా
ర్థంజేతుంగదయంచుఁ జాటుదిశలన్ । దెల్లంబుగా సాక్ష్యమీ
యంజూడం గనుపించి నిక్కమనిస్నే । హాప్రక్రియం బల్కియున్
గంజింతైనను బోయరావయదుకృష్ణా. 75

సుంతైనన్మఱిజాలియున్నయదెయే । జోక్యంబునన్ లేకయే
డ్వింతల్ బెట్టెదునీమనంబుశిలపో । ల్కింజేసెఁబోయెంతయుం
జింతంగొల్చుదు వేనుతింపనిది నీ । చిత్తంబో నాకర్మమో
స్వాంతంబందుఁ దలంచి తెల్పుమదికృష్ణా. 76

శ్రీచెంత న్నలుప్రక్కలన్ సతులునం । ప్రీతి న్వసింపంగనీ
చేచేచాచికుచంబులందుకొని త । చ్చిహ్నాదిలోలుండవై
యాచంద్రాంబునమోవిముద్దుగొనియా । హ్లాదంబుతో నవ్వుచున్
వాచాలుఁగొని నన్నుఁ గన్గొనవుకృష్ణా. 77

ప్రాలంద్రావిన నాటిచోరగుణమున్ । బాలిల్మలి యీరీతిమా
పాలంద్రోయుచునుంటివాతగునెయిం । పౌనంచునూహింపమా
పాలా పాడియె దాసులన్ వ్యథలముం । పన్ సర్వకాలంబిటుల్
చాలాపెట్టెదు దుశ్శ్రీమంబలుకఁగృష్ణా 78

రక్షశ్శిక్షయనాథ నిప్పగిది మా। ర్పక్షంబుగాఁ జూచియే
శిక్షం జేయఁ దలంపుఁ బూనిమదిలోఁ। జింతించు చున్నాఁడవో
వీక్షింపంగను దోఁచదెద్ది చెపు మీ। వేదాంత సంవేద్యకం
జాక్షా నాయెడ లోపమే దోయదుకృ।ష్ణా 79

క్షుప్పాయీవికిఁ దెప్ప యత్యఘ మహా।కూపారముం దాటఁ బె
న్ముప్పా దైత్యులకెల్ల కప్పమలస। న్ముక్తాళికిం జెప్పనీ
కొప్పామా యెడఁ దప్ప దేమొ మదిలో।నూహించుచున్నాఁడఁ గ
న్నప్పా పాప పురుప్పఁ ద్రోయుదువె కృ।ష్ణా 80

ఛ్చి వెంటం జన వద్దుపొమ్మనఁ గనే। మిమ్మెత్తుకొమ్మన్నచో
నావేశంబును గల్గదా యెవనికై। నన్నాదు దౌర్భాగ్యతా
దేవీ వెంబడిఁ గిట్టు చెప్పులను సం। దేహింపకే తొడ్గుచుం
గై వేబెత్తముఁ బట్టిముందరుగుఁ గృ।ష్ణా 81

రద్దుల్సేయఁగ నేల పెద్దగను నీ। లాగా ప్రభుల్ దీను నే
కొద్దింజూచినఁ జూడనోపఁగల రె। గ్గుల్ త్రోచిరక్షింపనీ
వద్దన్వారలు గల్గ రడ్డుపడ రీ। వాదేల నాతోడనన్
వద్దంజేరిచి బ్రోవు రాముపలికృ।ష్ణా. 82

నన్నన్నన్వడిఁ బ్రోవరావుకినుకా। నాపైనియద్దేవకిం
గన్నమ్మం దరిఁ జేరి పండుకొనెదిం। కన్నాకు దిక్కెవ్వ రెం
దున్నారో చెపుమయ్య భక్తతతి ని। ట్లోమున్నుఁ గాపాడఁటో
యన్నా బ్రోవఁగదన్న రాముపలికృ।ష్ణా. 83

ముంటే సర్వమునంటి పుచ్చుకొను ని ǀ ర్వాణ క్రియాలోలతన్
కంటే కంటికి తెప్పపోల్కి పరిజల ǀ గారుణ్యముంజూపుచున్
వింటేదీనుల మొఱ్ఱ సంభ్రమము న ǀ న్వీక్షించి కాపాడరా
నంటేనియ్యది యొగ్గుసుమ్మియదుకృ ǀ ష్ణా. 84

దుర్మార్గుండని దూఱుఁగాక పరిజ నీ ǀ తోపాటువారుండిరా
ధర్మాధర్మ వివేక శాలివయి యు ǀ ద్ధాత్రి దయంబ్రోచుచున్
గర్మాకారము లేవియుఁటకయె ని ǀ ష్కాపట్యశూన్యుండవై
నర్మోక్తుల్వచియించుచుండుదువుకృ ǀ ష్ణా. 85

నట్టేటన్ననుఁ ద్రోచినీవు నగుచు ǀ న్నాణెంబుగా నొడ్డునన్
గట్టాకష్ట మటంచు నెన్నకయె ని ǀ క్కంబైన లేనవ్వుతో
నిట్టట్టుం దిరుగాడుచున్ సరగు న ǀ న్నిద్రించి గుత్వొట్టుచు
న్నట్టే యుండఁగ మా గ తేమగునుగృ ǀ ష్ణా. 86

ప్రియానందమె బ్రహ్మమై వెలయు సు ǀ బ్రహ్మ నిత్యమైసత్యమై
తోయంబైనభమైధరిత్రియయి యెం ǀ తో వాయువై వహ్నియై
న్యాయంబై విధియై శశాంకుఁ డయిస ǀ ప్తాశ్వుండునై తేజమై
యాయారూపములై యతీతమయికృ ǀ ష్ణా. 87

రట్టోరచ్చలఁ దిన్నతిట్లొ నిను సం ǀ రంభంబునన్ బొజ్జత్రా
డ్గట్టంజానెడు మూరెడుంబెరిగియుం ǀ డం దల్లియా వెత్తి నె
ట్టెట్టోగట్టిగ ఱోటఁ బెట్టవడితో ǀ నే సాలవృక్షద్వయిన్
బట్టందూరి పెకల్పలేదెయదుకృ ǀ ష్ణా. 88

క్షుంపానాపని తెంపనీకడకు బ్రేమొ । కుక్కల్గొన్న రానన్నగు,
త్రింపాయియ్యది చూడఁజూడఁ గినుకం । దీపించి తప్పించెదే
యింపో తెంపుము వంపుగాదు మదిని । న్నేమన్నఁగాదంటినా
చంపఱ్ఱారి త్రఁగఁజూచెదే భళిరకృ।ష్ణా. 89

స్మిగోప్యంబతులంబుమాన్యముసదా । మేయంబు శ్రేయంబుస
త్యాగమ్యంబుచు నిర్వికార మజముఱ్ । ఖ్యాతంబునిర్బాధకం
బోగుఱ్ బాగుమజ్ఞానమూలముకడు । నోర్యగ్యంబుయుక్తంబనఱ్
గాఁగణ్యంబయి వెల్గురాముపలి కృ।ష్ణా. 90

గుత్రింపంగలవాఁడె యెవ్వఁడయినం । గూలంకషజ్ఞానముఱ్
వత్రింపంగలవాఁడె యెవ్వఁడయినఱ్ । సంపద్విలాసంబులన్
గీత్రింపంగలవాఁడె యెవ్వఁడయిన । న్నీదివ్య మాహాత్మ్యముఱ్
నత్రింపంగలవాఁడె వేడ్కఁగనికృ।ష్ణా. 91

రుద్రుండొక్కెడనీమహామహిమముఱ్ । రూపించి హృన్మోహతా
భద్రంబయిన సురూపముం గనుగొన । న్వాంఛించివేడంగ నీ
చిద్రూపంబును జూపమోహవశతం । జెందెన్మతెవ్వారిఁకఱ్
భద్రంబొందఁగఁ దాళువారు కనికృ।ష్ణా. 92

ఉప్పొందియ్యన పుల్లనంచనకయే । యున్మాదముంగొన్నతి
కప్పంబోలినవాఁడగానని మదిన్ । గాఠిన్యభావుండవై
యొప్పంజెల్లునె సాటివారు విననే । మూహింతురో ప్రోవఁగన్
దప్పానీకిది చెప్పరాము పలికృ।ష్ణా. 93

లాభంబించుక లేదు నన్నుఁ గొలువన్ । రాజాల దేయంచు మ
త్తేభంబెక్కియుఁ జాటిపట్టుదలతోఁ । దీండ్రించి దండింపనా
లోభంబెద్దియొ తెల్పవే దయను మొ।ఱ్ఱోయంచు వాపోవనీ
వాభంగిన్భవవార్ధిఁ దోయుదువె కృష్ణా. 94

జ్ఞప్తింజేసి తెనీదుసద్గుణాల స।న్మార్గంబు నిష్పాటికం
చాప్తిన్వేడిన దీనులం గనియుఁ జ।ర్చల్ సల్పవింతైన నా
ప్రాప్తిం తేకలదేమొ యేమనుదు ని।బ్బందేను బొందంగనో
యాప్తామర్త్య కటాక్షవీక్ష యదు కృష్ణా. 95

మేనంబ్రాణములున్న యంతవఱకు। న్మిథ్యానుబంధంబయన్
కానంబట్టిచరించుచుండుమని యే । గాథంబు దృష్టిన్మదిన్
బూనన్నీకిది పాడిఁగానె యకటా । భోర్మంచు నేడ్పింపక
య్యానన్గాసిలి మ్రొక్కుచుంటి యదు కృష్ణా. 96

దిట్టంపైన మనోదృఢంబునను నీ।దివ్యానురాగంబెయన్
చెట్టెక్కంగను బోవఁగంటకములే। జేయుంచనీ వెంత లే
నట్టుంగల్పనచేసినన్నుఁ గడుబ। న్నంబుల్వడింబెట్టినన్
గట్టాబోదుఫలంబుపైని భ్రమ కృష్ణా. 97

నిన్నేకాని భజింపనింక నొరులన్ ।నిక్కంబుగా భక్తితో
నున్నానోమఱిలేదొ నీకెతెలియు । న్యోజింపఁగా నాత్మలో
గన్నారంగననేలయింకనైనన్ । గాలంబు మెల్మెల్లనో
యన్నా పుచ్చుచునుంటివేలయదు కృష్ణా. 98

సుమ్మీమ్మీరలు నీతికోవిదులటంచున్ జాలబూజింతురా
నెమ్మిన్ భద్రయశంబు లేవిడవు కానీ యెందుఁబోదీవు చే
కొమ్మాసర్వము నీదెభారమనియే గోవిందలో నెంచి ని
త్యమ్మున్నే భజియించువాఁడ యదు కృష్ణా. 99

మన్నింపన్వడిరావదేమి శిబిమే న్మాంసంబుదానిచ్చె నం
చున్నీకున్ బలి సర్వమిచ్చెఁదనలో చ్చుంజూడకే భక్తినం
చన్నా కౌశికుకోర్కెదీర్చెనుహరి శ్చంద్రుఁడటంచెంచియో
నన్నుందోచినచే మొసంగఁగలఁ గృష్ణా. 100

త్రింటేకాని యెఱుంగరాదు రుచియే తీరుంగనుంగొన్నదె
బ్బంటేకాని భయంబుతోచదెదలోఁ బల్కుపల్కంగ స్థా
మ్మంటేకాని రయంబునంబలుక రెట్లైనన్ భవన్నామమే
యంటేకానివిముక్తిరాదుయదు కృష్ణా. 101

శ్రీనందంబునవోబళాపురపు వంశాగ్రేసరుండర్ఘభవ
ద్ధ్యానాసక్తుఁడలింగమూర్తి నిదె కృష్ణాభక్తకల్పద్రుమా
ఖ్యానంబైన శతంబొనర్చితిని దే వాపేక్షతోఁ గైకొనం
గా నర్పించితి గొన్మురాముఫలికృష్ణా భక్తకల్పద్రుమా.102

సంపూర్ణము.